వడిన వానిని విడిచిపుత్తము. జీవనముయొక్క బాహ్య అధికారమునుగాక అంతశ్శక్తులపై యధికారమును సంపాదించుకొనవలెను; క్షణభంగుర మగువానిని విడిచి శాశ్వతమగువానిని, గ్రహింపవలెను. ఆచరణాభ్యాసములలోనికి వశ్యమగు దానిని, ఆత్మయుతమగుదానిని, స్వార్థదూరమగుదానిని, మహనీయమగు దానిని జీర్ణించుకొనుడు—ఈ మొదలగునవి గ్రంథకర్త మొదటిభాగములో వ్రాసిన కొన్ని అభిప్రాయములు మాత్రము.

64 పుటలుగల రెండవభాగమున అభ్యుదయ భారతదేశముయొక్క ప్రబోధమునుగూర్చి వ్రాయబడినది. భారతవర్షముయొక్క స్థానము-కర్తవ్యము, భారతదేశమున కిప్పుడున్న లోపమేది, సాంఘాతికాధిపత్యమా, ఏకవ్యక్త్యాధిపత్యమా, భారతీయసంస్థానములు-బ్రిటిషు ఇండియా, భారతీయగ్రామము, స్వరాజ్యభారతవర్షముయొక్క కొన్ని సమస్యలు, ఆశయసాఫల్యము, భారతదేశమునకు స్వరాజ్యవిధానము అనుశీర్షికల క్రింద 8 అధ్యాయములుకలవు. నేటి ప్రపంచమంతయు రాజకీయైక్యమే పరమావధిగ ప్రాపించుటకు వాంఛించుటలేదు. జీవనమంతటి యొక్క జ్ఞానవిషయమైన-ఆధ్యాత్మికవిషయమైన ఐక్యము ఏకీభావము - అద్వైతము - నెలకొనుటకు ఆశించుచున్నదియని ఈభాగము తొలుత ప్రస్తావింపబడినది. భారతదేశసంప్రదాయమున నెప్పుడును రాజకీయప్రాభవముకంటె వేదాంతతత్త్వజ్ఞానమునందలి వాంఛయే ఎక్కువగనుండుట యొక్క మహత్తునుగూర్చి వివరింపబడినది. ప్రపంచమున నెప్పుడును ఏకవ్యక్తిపాలనము, ఏకవ్యక్త్యాధిపత్యమును మేలుచేయజాలియుండలేదనియు భారతీయతత్త్వమున కది యసలేసరిపడదనియు సాంఘాతికపద్ధతినే రాజ్యము జరుగవలెననియు బోధింపబడినది. మొత్తము భారతదేశలోని కొలది సంస్థానాధిపతులు కొంతత్యాగముచేసి బైటికి రావలెననియు ఆంగ్లప్రభుత్వమువారి చేతి కీలుబొమ్మలుగాక దేశసౌభాగ్యము నెంచి జాతీయులను పెంపొందించుచుండవలెగాక యనియు కోరబడినది. భారతీయగ్రామములోని-కార్యనిర్వహణమున్ను, పౌరజీవనమునే భవిష్యత్ప్రభుత్వమునకు ఆదర్శప్రాయముగ నుండవలెనని చెప్పబడినది. గ్రామమే దేశమున కాయువుపట్టు, పంటలగాదియని మరల మరల పేర్కొనబడినది. వ్యవసాయ సంబంధమైన ఋణములను వదలించుట, జనసామాన్యమునకు విద్య, సైనికదళవ్యయము బాగుగా తగ్గించుట లేక మానుట, ప్రభుత్వ నిర్వహణ వ్యయమును పెక్కురెట్లు తగ్గించుట, అత్యంత-ఉన్నతోద్యోగికి నెలకు వేయిరూపాయిలకంటె నధికమీయకుండుట—ముఖ్యమని తెలుపబడినది. గ్రామసంఘము, పంచాయతీ, జిల్లాకార్యనిర్వాహకసంఘము, రాష్ట్రీయసంఘములు, కార్యనిర్వహణము, భారతీయ సమాఖ్యసభ-ఇవి ఒకటిపైనొకటి మెట్లుగా ప్రభుత్వము జరుగవలెననియు, క్రమముగ మధ్యమెట్లు నెమ్మదిగ తొలగిపోయి గ్రామపంచాయతీ గ్రామమును నిర్వహించుచు నానారాజ్యసమితి రాజ్యములను నిర్వహించుచు నుండవలెనని-ఒకరిపైనొకరు రాజ్యమేలు పద్ధతి పోవనే వలయుననియు నొక్కి-చెప్పబడినది. స్వతంత్రభావము అందరు వ్యక్తులలోను అన్ని గ్రామములలోను కలిగి ఉన్న శాస్త్రపరిశోధనల వలన నేర్పడిన పరికరములను పనుముట్లను సౌఖ్యమునకుపయోగించుకొనుచుండియు యంత్రసాధనల నాగరికతయందు వ్యామోహము తొలగి బ్రహ్మానందము నిచ్చు పరమశాశ్వతవస్తువును గూర్చిన వాంఛను వృద్ధిచేసికొను నవకాశములను గూర్చి చెప్పుటతో నీగ్రంథము ముగింపబడినది. అనుబంధముగ చేర్చిన ప్రపంచములోని 42 ముఖ్యదేశముల వైశాల్యమును, జనసంఖ్యయు, ప్రభుత్వవిధానమును తెలుపు పట్టిక రాజకీయలోకజ్ఞానమున కెంతయు తోడ్పడును. దినమునకు తలకొకటికి 6 అణాల ఖర్చుతో ప్రపంచమంతటను నగు మానవశక్తి దుర్వినియోగమును పట్టి ప్రభుత్వముల వలని నష్టము నూహించుకొనుడు అని యీ అనుబంధము తుదిని హెచ్చరింపబడినది.

మొత్తమున ప్రపంచముయొక్కయు, భారతదేశముయొక్కయు ఆది చరిత్రమునుండి ఆధునిక నాగరికతా చరిత్రమువరకు నుండు పరిస్థితుల పరిణామములు వర్ణించుచు నవీననాగరికతను గూర్చిన నిర్మాణోద్యోగసంయుత ఆలోచనను కూర్చిన యీగ్రంథము ఆదర్శ సారస్వత, ఆర్థిక రాజ

, ఆధ్యాత్మిక విషయాలయొక్క ఆదర్శ పరిస్థితుల నూ టకుతో వ్యవడుచున్నది. ఋషులును, దీర్ఘదర్శులును తీయ సంప్రదాయములపై నిర్మించిన విధానమును పుర రించుకొని ప్రపంచశాంతికిని, అంతర్జాతీయ సౌమ నస్యమునకును దారిచూపు నీ 'పై మెట్టు' నందికొని బుద్ధి తు లందరును మీదికి పోగలరు. జ. బ్ర.

## ముత్యాల సరములు—చిన్నకథలు

గ్రంథకర్త: (కీ. శే.) గురజాడ వెంకటఅప్పారావు గారు, బి. ఏ., ఎఫ్. ఎమ్. యు; ప్రకాశకులు: గురజాడ వెంకట రామదాసుగారు, విజయనగరము. మను ౧౬ సైజు. ౧౨౧ పుటలు. వెల తెలియదు.

వాలకాలము క్రిందటే ప్రకటితములైన ఈసంపుటి ములోని కొన్ని ఖండకావ్యాలద్వారా శ్రీఅప్పారావు లుగారు తమసంస్కార ప్రియతకు ఒకవంక కొంత వాదరాలను, వేఱొకవంక కొంతనిరసనను సంపా మకొన్నారు. నేటి తెలుగువాఙ్మయపు క్రొత్తపో లకు బీజాలు, నూతనలు వీరికవిత ధరించి ఉన్నది. నేటి రస్వత పరివర్తనానికి వీరిఆకాంక్ష వీరికవితలో స్పష్టము.

యాదృచ్ఛికమైన స్వప్నోల్లేఖనముచేత గాక, ఆవేశవిస్ఫోటనముచేత గాక, బుద్ధిపూర్వకముగా విప్లవము, పరివర్తనము అవలంబిస్తుంది వీరి సారస్వత రచనోద్యమము. కనుకనే కాబోలు, ఈకావ్యాలలో తేజము, సారము అపూర్ణములు.

శక్తిచేతగాని, పరిమాణముచేతగాని ఈకావ్య ములు—అన్నికావ్యాలూ తొలుతనే ప్రకటింప బడి ఉన్నా— ఆధునికవాఙ్మయానికి అధినాయకత్వము వహింపలేదు. అయితే ప్రకటితములైన 'లవణరాజుకల' మొదలైనకావ్యాలు తమ ప్రౌఢ్యముచేత ఒకనూతనమైన అభిరుచి వాఙ్మయములో కేతింపక పోలేదు. నూత్నకవితకు పథప్రదర్శనమే చేసినవి. వీరి తేజస్వి అయిన ప్రతిభ 'ముత్యాలసరము' అనే క్రొత్త ఛందస్సు ప్రవర్తింపజేసి శాశ్వతఖ్యాతి గడించుకొన్నది. ఈఛందస్సు వీరు చేర్పుతో— ముఖ్యముగా కథనకావ్యలకు— వినియోగించి దీనిఅందమునూ, ఆమహాల్యమునూ ప్రదర్శించినారు. తరువాతి యువకవులచేత పోలుపులు దిద్దిన ఈ 'ముత్యాలసరము' తొలుత వీరిచేతమాత్రము నియమాగతసౌందర్యము కొంత కోలుపడినమాట నిజము. అయితే చిరకాలమునుండి వాఙ్మయములో అవలంబనము పొంది ఉన్న ఉత్కటనియమాల నిరంకుశతకు ఎదురొడ్డి నిలిచి వీరు తమనుడికి 'ఒక విప్లవబిడిఅయిన, సున్నితమైన ఛందస్సు లలితసంగీతములో తెలయించుకోవలెనని పూనిన సంకల్పమే ఈయనియతికి బాధ్యము కావలెను. ఇంక, 'పాటివా రోదార్చె' వంటి వాక్యదోషాలుకూడా రచయిత లక్ష్యపెట్టలేదు. శైలిలో అసంస్కృతి వీరి సంస్కారలాలసకు ఒప్పినది— జాతీయత తీసి విలసిల్లి నంతనలకు—ఉత్సుకతలో కొంత అతిక్రమించినాడా. ఈ ఉల్లంఘనానికి అతిగా ప్రేరేచిన ఒక స్వాతంత్ర్యము వీరికి సహజమై, పులకరించే కవితాలో కనపటిమలోని కొఱతల నాక్రమించి, ఇంచుమించు వీకావ్యానికీ సమగ్రత పూర్ణకోసేనిత్త కుదురనీయ లేదు కాబోలు.

అయినా, 'లవణరాజుకల', 'కన్యక'; 'డామన్ పితియస్' మొదలైన కథన కావ్యాలలో స్వల్పమై భాషానియమాలచేత సహజమధురమైనవీరి శైలి మధుర తరమయినది తరుచు. దీనికి తోడు, వాడుకభా అన్నం దుల కు, చక్కని నుడి కార ము, జా యత, స్వాభావికత ఒప్పిఉన్నవి. సంభాషణ భా లలో నాటకౌచిత్య సౌందర్యాలు తులకిస్తవి. వాడు పట్టు సహజముగా, సమ్మతముగా విలసిల్లుతుంది. క ములో జీవము పొంగుతూ ఉంటుంది. 'పూర్ణమ్మ' ఆడపిల్లల పాటు మన మధురకవితల పోకడలలో తీ చిలికి, సందర్భ మెలిగిన నుడితో, కన్నెవలె పవిత్ర జాలికథతో పాఠకుల సానుభూతిని చూఱకొంటున

క్రొత్తభావాలతో సుకుమారముగా సత్యా త్యనిరూపణచేసే భాగాలు రచయిత కళారహస్యా ర్యానుభవము వెల్లడిస్తూ ఉన్నవి.

